కంచికిచేరంగా సమస్త లాంఛనాలతో ఆలయ మర్యాద లతో ఆ వస్త్రాలకు స్వాగతం, ఊరేగింపు జరిగాయి. ఆ తర్వాత శ్రీ ప్రసాద్ నేతృత్వంలో ఈ బృందం అత్తివరదుని సందర్శించి తీర్థప్రసాదాలు స్వీకరించి బహుమానం సమర్పించింది.



ఈ కార్యక్రమానంతరం జరిగిన ఇష్టాగోష్ఠి సమావేశంలో కంచి దేవస్థానం పక్షాన కార్యనిర్వహ ణాధికారి శ్రీ సుబ్రమణియన్ ఆలయ మర్యాదలు జరిపి తిరుమల తిరుపతి దేవస్థానానికి రెండుఛత్రాలు సమర్పించారు. దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ కంచిలో ఒక ధర్మశాలను ఒక సమా





చార కేంద్రాన్ని నెలకొల్పే ప్రతిపాదనను వివ రించారు. తరువాత తిరుమల తిరుపతి దేవస్థాన అధికార్ల బృందాన్ని ఊరి పొలిమేరల వరకు ఘనంగా తగు మర్యాదలతో సాగనంపడం జరిగింది.



*